ఎత్తులు పైఎత్తులతో మిమ్మల్ని నవ్వుల్లో ముంచెత్తే సరదా కథ

# ఇద్దరూ గజదొంగలే

డా॥ ఎం. హరికిషన్

94410 32212





# ఇద్దరూ గజదొంగలే

## సంయుక్త అక్షరాలు లేని సరదా కథ


డా॥ ఎం. హరికిషన్

94410 32212




ఒక రాజ్యంలో రాజశేఖరుడు, మధుసూదనుడు అని ఇద్దరు గజదొంగలు వుండేటోళ్ళు. ఇద్దరూ ఒకరిని మించిన దొంగ మరొకరు. వాళ్ళ కన్ను దేనిమీదన్నా పడిందంటే చాలు... మరుక్షణమే అది మాయమయ్యేది. వాళ్ళు చిన్న చిన్న దొంగతనాలు అస్సలు చేసేటోళ్ళు కాదు. కొడితే గద్దలను, రాబందులను కొట్టాలిగానీ చిన్న చిన్న పిట్టలను కాదు అనుకునేటోళ్ళు. వాళ్ళిద్దరూ పక్కపక్క వీధుల్లోనే వున్నప్పటికీ ఎవరికి వాళ్ళు సొంతంగా దొంగతనాలు చేసేవాళ్ళే గానీ కలిసి అస్సలు చేసేవాళ్ళు కాదు. అసలు వాళ్ళ మధ్య ఎటువంటి సంబంధాలు కాదు గదా కనీసం మాటలు గూడా వుండేటివి కాదు. వాళ్ళు అంత పెద్ద గజదొంగలయినా ఆ రాజ్యంలో ఎవరికీ అస్సలు తెలీదు. రాజశేఖరుడేమో సరుకులు అమ్మే అంగడి పెట్టుకోగా మధుసూదనుడేమో బట్టలు అమ్మేవాడు. పొద్దునంతా ఎవరికీ అనుమానం రాకుండా అందరిలాగే వ్యాపారాలు చేసి, రాత్రిళ్ళు అదీ అవసరమైనప్పుడు మాత్రమే దొంగతనాలు చేసేవాళ్ళు.

ఆ రాజ్యానికి రాజు చానా దుర్మార్గుడు. నిరంతరం చుట్టుపక్కల రాజ్యాల మీద దాడి చేసి అక్కడి సొమ్మంతా దోచుకొచ్చేవాడు. రాజులు గూడా తమలాగే పెద్ద గజదొంగలని వాళ్ళ అభిప్రాయం. ఆ రాజు అలా దోచుకొచ్చిన సొమ్మంతా పెట్టి ఒక ఖరీదయిన వజ్రాలహారం కిందటి సంవత్సరం చేయించాడు. అందులోని ఒక్కొక్క వజ్రం కోట్ల వరహాల విలువ చేస్తాది. ఆ విలువైన హారాన్ని ఆ సంవత్సరం ఉగాదికి రాజమందిరంలో ప్రజల దర్శనార్థం పెట్టాడు. జనాలంతా తిరునాల లెక్క వచ్చి చూచిపోయారు. రాజశేఖరుడు, మధుసూదనుడు గూడా పోయి దాన్ని చూశారు. “అబ్బ... కొట్టేస్తే ఇలాంటి దాన్ని కొట్టేయాల... పది తరాలు పండుకోని తినొచ్చు” అనుకున్నారు. కానీ ఉగాది అయిపోయిన వెంటనే దాన్ని భద్రంగా అంతఃపురంలో ఎవరికీ తెలీనిచోట భద్రపరిచారు. దాంతో వాళ్ళు మరలా ఉగాది ఎప్పుడొస్తుందా, దాన్ని ఎప్పుడు ప్రదర్శనకు పెడతారా అని ఆతృతగా ఎదురు చూడసాగారు. ఇద్దరూ దాన్ని కొట్టేయడానికి ఎవరి పథకాలు వాళ్ళు సిద్ధం చేసుకోసాగారు. అనుకున్నట్లే ఆ సంవత్సరం గూడా ఉగాది రాగానే రాజు ఆ వజ్రాలహారాన్ని ప్రత్యేక పూజలు చేసి ప్రజల దర్శనార్థం పెట్టాడు.

జనాలంతా కుప్పలు తెప్పలుగా వస్తా వున్నారు. ఆ విలువైన హారాన్ని ఒక పెద్దగదిలో దేవతా విగ్రహం ముందు ప్రదర్శనకు వుంచారు. జనాలు పూర్తి దగ్గరకు వెళ్ళకుండా, కొంచం దూరంలో నుంచే చూసి, దేవతకు మొక్కుకుని వెళ్ళేలా ఏర్పాట్లు చేశారు. విగ్రహం దగ్గర కొందరు పూజారులు కూర్చుని వున్నారు. వస్తున్నవారికి హారతినిస్తూ, పూజలు చేస్తా వున్నారు. దేవతకు రెండువైపులా ఊదికడ్డీలు గుత్తులుగుత్తులుగా వెలుగుతా వున్నాయి. గది లోపలా బైటా సైనికులు వేయికళ్ళతో పహారా కాస్తా వున్నారు. ఇద్దరు దొంగలు చెరొకవైపున గుంపులో నిలబడి ఒకొక్క అడుగే వేస్తా వున్నారు. ఒకరినొకరు గమనించినా గమనించనట్టే వున్నారు. .

రాజశేఖరుడు నెమ్మదిగా జేబులోంచి ఒక కోరలు లేని నాగుబామును బైటకు తీశాడు. దానిని జనాల కాళ్ళ మధ్య వదులుతా “పాము... పాము” అంటూ గట్టిగా అరిచాడు. అంతే... ఒక్కసారిగా అందరూ అదిరిపడ్డారు. కాళ్ళ మధ్య పామును చూసి ఎక్కడ అది తమను కాటేస్తుందో ఏమో అని భయపడి తలా ఒక దిక్కు వురకసాగారు. ఒక్కసారిగా అక్కడ పెద్ద ఎత్తున గందరగోళం, తొక్కిసలాట మొదలయ్యాయి. వెంటనే రాజశేఖరుడు జనాలని తప్పించుకుంటా దేవతా విగ్రహం వైపు వేగంగా కదలసాగాడు. సైనికులు,

పూజారులు గూడా భయంతో బైటకి పరుగులు తీయసాగారు.

మధుసూదనుడు అదంతా గమనించాడు. రాజశేఖరుని ఎత్తుగడ అర్థమైంది. ఒక్కక్షణం ఆలస్యం చేసినా ఆ హారం రాజశేఖరుని చేతిలో పడుతుంది. వెంటనే దేవతా విగ్రహానికి ఎవరెంత దూరం వున్నారో కళ్ళతోనే అంచనా వేశాడు. రాజశేఖరుని కంటే తానే హారానికి కొంచం దగ్గరలో వున్నాడు. అంతే ఒక్క క్షణం గూడా ఆలస్యం చేయకుండా మెరుపువేగంతో కదిలాడు. జేబులోంచి సాంబ్రాణి పొట్లం బైటకు తీశాడు. విగ్రహం ముందు వెలుగుతావున్న వూదికడ్డీల మీద చల్లాడు. అంతే.... ఒక్కసారిగా ఆ దేవతా విగ్రహం వున్నప్రాంతమంతా చిక్కటి పొగ కమ్ముకుంది. మధుసూదనుడు అంతకు ముందే అచ్చం అలాంటి రత్నాలహారమే నకిలీది పొరుగురాజ్యంలో చేయించి జేబులో సిద్ధం చేసుకుని వున్నాడు. అక్కడ పొగ అలుముకోవడం అలస్యం మెరుపువేగంతో విగ్రహం ముందున్న నగ మాయం చేసి, నకిలీ హారం అక్కడ పెట్టేశాడు.

అలా పొగ ఆ ప్రాంతమంతా కమ్ముకునేసరికి భటులు అదిరిపడ్డారు. నగను ఎవరైనా ఎత్తుకొని పోతున్నారేమో అని అక్కడికి దూసుకువచ్చారు. అంతలో

కొందరు నాగుబామును చంపేశారు.

తొక్కిసలాడుతావున్న జనాలకంతా నచ్చచెప్పి వరుసగా నిలబెట్టారు. పొగ తొలగిపోగానే దేవతావిగ్రహం ముందు నగ ఎప్పటిలాగా మెరుస్తా కనబడడంతో హమ్మయ్య అని వూపిరి పీల్చుకున్నారు.

రాజశేఖరుడు ముందుకు వచ్చి నగను తన కళ్ళతో పరిశీలనగా చూశాడు. హారం ఇంతకు ముందుకన్నా కొంచం ఎక్కువగా నిగనిగనిగ మెరుస్తా కనబడింది. పాతనగకు కొత్త నగకు మధ్య వున్న తేడా క్షణంలో తెలిసిపోయింది. మధుసూదనుని కోసం చుట్టూ చూశాడు. అప్పటికే బైటకి అడుగుపెడతా కనబన్నాడు. వెంటనే రాజశేఖరుడు జనాలను ఒక్కొక్కరినే తప్పించుకుంటా వేగంగా బైటకొచ్చాడు.

కానీ అంతలోపే మధుసూదనుడు గుర్రమెక్కి ఆ వీధి దాటిపోతా కనబన్నాడు. వాని వెనుకపోయి లాభం లేదనుకొన్న రాజశేఖరుడు వెంటనే మధుసూదనుని అంగడి దగ్గరికి పోయి ఎవరికీ కనబడకుండా ఒక ఇంటి మిద్దె మీద దాచి పెట్టుకోని వాని కోసం ఎదురుచూడసాగాడు.

రెండుగంటల తరువాత మధుసూదనుడు తిరిగి ఇంటికి వచ్చాడు. గుర్రాన్ని ఇంటిబైట చెట్టునీడలో కట్టేసి, ఏమీ తెలియని అమాయకునిలా అంగడి తెరిచి

ఎప్పటిలాగానే కూర్చున్నాడు.

రాజశేఖరుడు బాగా ఆలోచించాడు. దొంగతనం చేయడానికి, అంగడి తెరవడానికి మధ్య సమయం రెండు గంటలు. అంటే రెండు గంటల్లో పోయివచ్చే ప్రదేశంలో ఎక్కడో ఈ వజ్రాలహారం దాచి పెట్టి వచ్చింటాడు. గుర్రం కాళ్ళగిట్టలు బాగా పరిశీలించాడు. ఎర్రగా దుమ్ము కొట్టుకొని వున్నాయి. పోయిన ప్రదేశంలో నగ దాచిపెట్టడానికి ఎంత లేదనుకున్నా అరగంటన్నా పడుతుంది. అంటే పోవడానికి ముక్కాలు గంట, రావడానికి ముక్కాలుగంట. గుర్రమ్మీద ముక్కాలు గంటలో దాదాపు ఎనిమిది మైళ్ళదాకా పోవచ్చు. రాజ్యం చుట్టూ ఎనిమిది మైళ్ళదూరంలో ఎవరూ అడుగుపెట్టని పాడుబన్న ప్రదేశాలు ఏమున్నాయా అని ఆలోచించసాగాడు. అది గూడా ఎర్రమట్టి వున్న దారి. అంతలో వానికి రాజ్యం కుడివైపున అడవిలో వున్న ఒక పాడుబడిన సత్రం గుర్తుకు వచ్చింది. దాదాపు సగందాకా పడిపోయింది. ఆ దారిలో అసలు ఎవరూ పోరు. చిన్న ఎర్రని మట్టిదారి అంతే. అక్కడికి చేరుకోవాలంటే దాదాపు ముక్కాలు గంట పడుతుంది. రాజశేఖరుని పెదాలపై చిరునవ్వు మెరిసింది. వెంటనే వేగంగా అక్కడికి చేరుకున్నాడు.

సత్రం ముందు అంతా పరిశీలించాడు. ఒక చెట్టు

కింద పచ్చగడ్డి ఒకచోట చాలా తక్కువగా వుంది. ఇక్కడే గుర్రాన్ని కట్టేసినట్టున్నాడు. అది గడ్డి కొరికి తినడం వల్ల అక్కడంతా ఖాళీగా వుందని అర్థమైంది. నెమ్మదిగా సత్రంలోకి అడుగుపెట్టాడు. గోడల్ని అణువణువూ పరిశీలించసాగాడు. ఎక్కడా ఎటువంటి జాడా దొరకలేదు. ఎక్కడ పెట్టి వుంటాడా అని ఆలోచిస్తా వుంటే సత్రం లోపల నిలువుగా వున్న స్తంభాలు కనబడ్డాయి. నున్నగా పట్టుకుంటే జారిపోయేలా వున్నాయి. ఒక్కొక్క స్తంభాన్నే చూస్తూ బైలుదేరాడు. ఒక స్తంభం మాత్రం మరీ అంత నున్నగా లేదు. కొంచం గరుకుగా పట్టుకొని పైకెక్కడానికి వీలుగా వుంది. పైకి చూశాడు. స్తంభం పైన పైకప్పుకు అనుకొని వున్న చోట చిన్న గూడులాగా వుంది. నెమ్మదిగా స్తంభాన్ని పట్టుకొని పైకి పాకాడు. గూట్లో చేయి పెట్టాడు. లోపల ఒక చిన్న ఎర్రని చెక్కపెట్టె వుంది. దానిని బైటకి తీశాడు. చూస్తే ఇంకేముంది వజ్రాలహారం ధగధగధగ మెరుస్తా కనబడింది. వెంటనే దాన్ని తీసుకోని అక్కడినుంచి తిరిగివచ్చి తన ఇంట్లో ఎవరికీ తెలియకుండా భద్రంగా దాచి పెట్టాడు.

వారం తరువాత మధుసూదనుడు అక్కడికి వెళ్ళి చూస్తే ఇంకేముంది.... వజ్రాలహారం లేదు. ఎవరూ వూహించలేని ప్రదేశంలో దాచిపెడితే కూడా దాన్ని

గూడా కనుక్కోని కొట్టేసినాడంటే వాడు సామాన్యుడు కాదు ఖచ్చితంగా నాలాగే పెద్ద గజదొంగనే అయింటాడు. ఎవడయి వుంటాడా అని ఆలోచిస్తావుంటే రాజశేఖరుడు గుర్తుకు వచ్చాడు. తాను నకిలీ నగ మార్చినది ఎవరూ కనుక్కోలేకపోయినా రాజశేఖరుడు కనుక్కోనింటాడు. దాంతో నన్ను అనుసరించి ఈ ప్రదేశాన్ని కనిపెట్టి వజ్రాలహారం కొట్టేసింటాడు అని వూహించాడు. తాను వూహిస్తున్నది నిజమోకాదో తెలుసుకోవడం కోసం ఎవరికీ అనుమానం రాకుండా మారువేషం వేసుకొని రాజశేఖరుడు వుండే వీధుల్లో తిరుగుతా గమనించసాగాడు.

తరువాత రోజు పొద్దున్నే రాజశేఖరుడు ఉత్సాహంగా చిరునవ్వుతో బట్టల అంగడికి బైలుదేరాడు. వాని ఉత్సాహం, చిరునవ్వు చూడగానే మధుసూదనునికి నమ్మకం కుదిరింది. ఏ దొంగకైనా సరే తాను కొట్టేయాలనుకున్నది ఇంకొకడు కొట్టేస్తే ఒక్కసారిగా నీరసం ముంచుకొచ్చేస్తాది. ఉత్సాహం చచ్చిపోతాది. కానీ

వీడు ఇంత సంబరంగా, జల్సాగా వున్నాడంటే ఖచ్చితంగా వజ్రాలహారం వీని దగ్గర వున్నట్టే అని తీర్మానించుకున్నాడు.

నెమ్మదిగా వాని ఇంటి వెనుకవైపు చేరి గోడ దుంకి

లోపలికి అడుగు పెట్టాడు. ఒక్కొక్క గది ఇంచు గూడా వదలకుండా వెదకసాగాడు. బీరువాలు, ట్రంకుపెట్టెలు, వంటింటిలోని డబ్బాలు, అటకపైనా, మంచం కింద ఏవీ వదల్లేదు. కానీ ఎక్కడా ఏమీ దొరకలేదు. 'నాలాగే ఇంట్లోగాక ఇంకెక్కడన్నా బైట దాచిపెట్టాడా..... అట్లాగయితే ఎట్లా కనుక్కోవడం...” అని నిరాశగా బైటకి వస్తా వుంటే... గోడకి ఒక మూల ఆనించిన గడ్డపార కనబడింది. దానికిందంతా మట్టి అంటుకొని వుంది. వెంటనే మధుసూదనుని పెదాల మీద చిరునవ్వు మెరిసింది. మెరుపు వేగంతో ఇంటి వెనుకవైపు వున్న పెరట్లోకి అడుగుపెట్టాడు.

అక్కడంతా చిన్న చిన్న మొక్కలు నాటి వున్నాయి. నేల మీద కాలితో గట్టిగా నొక్కుతా ఒక్కొక్క అడుగే వేస్తా పెరడంతా తిరగసాగాడు. ఒకచోట కాలికి మెత్తగా నేల తగిలింది. ఎక్కడైనా గుంత తవ్వి, ఎవరూ కనుక్కోకుండా మరలా మట్టి వేసి, చదునుగా చేసినా, అక్కడ మరలా భూమి గట్టిపడటానికి కొన్ని రోజులు పడుతుందిగదా... వెంటనే అక్కడ తవ్వాడు. లోపల వజ్రాలహారం వున్న పెట్టె భద్రంగా వుంది. వెంటనే దాన్ని తీసుకొని సంబరంగా అక్కన్నించి బైటపడ్డాడు.

రాజశేఖరుడు సాయంకాలం వచ్చి చూస్తే ఇంకేముంది పెరట్లో తవ్విన గుంత వెక్కిరిస్తా

కనబడింది. మధుసూదనుడే తిరిగి దానిని కొట్టేసింటాడని అర్థమైంది.

మధుసూదనుడు దాన్ని తీసుకుపోయి ఎక్కడ దాచిపెట్టి వుంటాడో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. ఎలుకను కలుగులోంచి బైటకు రప్పియ్యాలంటే పొగ బెట్టాల్సిందే. బాగా ఆలోచించి ఒక ఉత్తరం రాసి దానిని ఒక పిల్లోని చేతికిచ్చి పంపాడు. మధుసూదనుడు ఆ ఉత్తరం చదవగానే అదిరిపడ్డాడు. అందులో

"మధుసూదనా... నువ్వు నిన్న మా ఇంట్లో కొట్టేసిన వజ్రాలహారం మరలా నా దగ్గరికే వచ్చేసింది. ఇంకోసారి ఇలా కొట్టేయడానికి ప్రయత్నించకు. అలా ప్రయత్నిస్తే అదే నీకు ఆఖరిరోజవుతుంది జాగ్రత్త" అని వుంది.

అది చూడగానే మధుసూదనుడు అదిరిపడ్డాడు. వేగంగా అంగడి బైటకొచ్చి చుట్టూ చూశాడు. ఎక్కడా ఎవరూ కనబడలేదు. తాను అంత భద్రంగా దాచిపెట్టినా వీనికి ఎలా తెలిసింది. ఇంతకూ వాడు చెబుతున్నది నిజమా కాదా అని అనుమానం వచ్చింది. వెంటనే గుర్రమెక్కి వజ్రాలహారం దాచి పెట్టిన చోటుకి బైలుదేరాడు.

ఊరు దాటి దాదాపు పదిమైళ్ళు పక్కనున్న దట్టమైన అడవిలో ప్రయాణించాక ఒక పెద్ద మర్రిచెట్టు వచ్చింది. దాని పక్కన ఒక పాడుబన్న లోతైన బావి వుంది. దానిలో

ఎప్పుడూ నీళ్ళు వుండవు. దిగడానికి మెట్లు గూడా వుండవు. దాంతో ఎవరూ ఆ బావిని పట్టించ్చుకోరు. తన వెంట తెచ్చుకున్న ఒక పెద్ద తాడును మర్రిచెట్టు కొమ్మకు కట్టి రెండో కొన బావిలోకి వదిలాడు. దాన్ని పట్టుకొని నెమ్మదిగా లోపలికి దిగాడు. బావి చుట్టూ రాళ్ళున్నాయి. ఒక రాయిని పట్టుకొని నెమ్మదిగా లాగి పక్కకు తీశాడు. లోపలికి చేయి పెట్టాడు. చెక్కపెట్టి తగిలింది. తీసి చూస్తే ఇంకేముంది... లోపల వజ్రాలహారం ఎట్లున్నది అట్లాగే వుంది. 'మరి రాజశేఖరుడెందుకు అట్లా ఉత్తరం రాసి పంపించాడు. అది చూసి నేను కంగారుపడి వేగంగా ఇక్కడకు వస్తానని వూహించాడా... అదే నిజమైతే ఇప్పటికంతా వాడు బావి దగ్గరకు వచ్చేసింటాడు. మరి ఈ వజ్రాలహారం వానికి దక్కకుండా ఏం చేయాలి' అని ఆలోచిస్తా జేబులోంచి ఒక చిన్న పొట్లం తీసి పెట్టె లోపల పెట్టాడు. పైకి రావడానికి తాడు కోసం చూశాడు. ఆశ్చర్యం అక్కడ తాడు లేదు. అదిరిపడి పైకి చూశాడు. పైన రాజశేఖరుడు చిరునవ్వుతో కనబన్నాడు. వాని చేతిలో తాడు వుంది.

వాడు లోపలికి చూస్తా "మిత్రమా... ఆ వజ్రాలహారాన్ని ముందు ఈ తాడుకి కట్టి పంపించు. ఆ తరువాత మరలా తాడు నీకోసం వేస్తా. ఏం సరేనా" అన్నాడు.

"పంపించకపోతే... ఏం చేస్తావు" అన్నాడు మధుసూదనుడు లోపలి నుంచి.

"చూడు! నేను చెప్పినట్టు వినడం తప్ప నీకు ఇంకో దారి లేదు. పైనుంచి నాలుగు పెద్ద పెద్ద బండ రాళ్ళు మీద పడేస్తే తల పగిలి అక్కడికక్కడే చస్తావు. కానీ తోటిదొంగను చంపడానికి మనసు రావడం లేదు. నోరు మూసుకోని హారాన్ని పైకి పంపు అంటూ తాడు లోపలికి వదిలాడు. వాడు వజ్రాలహారం వున్న చెక్కపెట్టెను దానికి కట్టగానే రాజశేఖరుడు పైకి లాక్కున్నాడు. తాడుకి కొంచం నూనె రాసి లోపలికి వదిలాడు. అది జారుతా వుండడంతో మధుసూదనుడు బైటపడటానికి దాదాపు గంట పట్టింది. అంతలోపు రాజశేఖరుడు అక్కడినుంచి మాయమయ్యాడు.

అలా కొంచెం దూరం పోయాక రాజశేఖరునికి ఆ చెక్కపెట్టెలో వున్నది నిజమైన హారమా, నకిలీ హారమా అని అనుమానం వచ్చింది. ఎందుకైనా మంచిది ఒకసారి చూద్దాం అనుకొని పెట్టె తెరిచాడు. ఆ నగ కింద బంగారు రంగులో మెరిసిపోతా వున్న ఒక చిన్న పొట్లం వుంది. అది ఏమిటో అర్థం గాక నెమ్మదిగా విప్పాడు. అందులో తెల్లని పొడి వుంది. ఏమిటబ్బా ఇది అని ఆలోచిస్తున్నంతలోనే సర్రుమని గాలి వీచింది.

అంతే... ఆ పొడి పైకెగిరి గాలిలో కలిసిపోయింది. దానిని పీల్చిన మరుక్షణం రాజశేఖరుని ఒళ్ళంతా మత్తు అవరించడం మొదలు పెట్టింది. అది మత్తుమందు కలిపిన పొడి అని అర్థమయ్యేసరికి వాడు దభీమని గుర్రమ్మీద నుంచి తూలి కిందపడిపోయాడు.

కాసేపటికి మధుసూదనుడు అక్కడికి వచ్చాడు. రాజశేఖరుని పక్కన పడివున్న వజ్రాలహారాన్ని తీసుకొని పెట్టెలో భద్రంగా పెట్టాడు. ఒక కాగితం తీసి దాని మీద "మనం ఇలా ఒకరి నుంచి ఒకరం కొట్టేస్తా ఎంతకాలం గడుపుతాం. ఇది ఆఖరికి మనలో ఎవరో ఒకరి ప్రాణాల మీదకే వస్తుంది. కాబట్టి ఇక ఆట ఆపేద్దాం. సగం సగం పంచుకుందాం. ఒక వారం లోపల పక్క రాజ్యంలో దాన్ని అమ్మేసి నీ వాటా నీకు అందజేస్తా. ఏం సరేనా" అని రాసి రాజశేఖరుని జేబులో పెట్టాడు.

గంటకంతా మత్తు వదిలిన రాజశేఖరుడు జేబులో వున్న కాగితాన్ని చూసి చిరునవ్వు నవ్వుకున్నాడు.

నవ్వుల్లో ముంచెత్తే అద్భుత కథ

# ఇద్దరూ గజదొంగలే


డా॥ ఎం. హరికిషన్

94410 32212


